# అమృతకణములు

శ్రీమతి [illegible]



శిరోమణి:

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

వెల ౦-౮-౬

ప్రతులు ౧౦౦౦

Printed by Mr. K. L. NARASAYYA,
at the Andhra Grandhalaya Press,
BEZWADA.
1942

ప్రాప్తిస్థానము:
శిరోమణి : సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి,
44, జీరా,
సికింద్రాబాద్
(దక్కన్).

# చిన్నమాట

'శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః అని'
యాలంకారికుల మతము. కావుననే భరతుఁడు తొట్టి యాలంకారికు
లెల్లరును బ్రప్రథమమున శృంగారమునే కీర్తించిరి. పైఁగా దీనికి
విష్ణు వధిదైవత మనియు నిది యుత్తమ ప్రకృతిప్రాయ మని
యును స్తుతించిరి.

సంస్కృతాలంకారగ్రంథములం దుదాహృతము లగు
నా శృంగారశ్లోకము లమృతతరంగములు. ఆ గ్రంథజాలము
నందుఁ బ్రకృతోపలభ్యమానము లగు అమరుకావ్యము, గాథాసప్త
శతి, శాకుంతలము మొదలగు కావ్యసముదాయమునుండి కొన్ని
శ్లోకము లుదాహరింపఁ బడినవి. కానీ పెక్కింటి కాకరము
మృగ్యము. ఉపలభ్యమానగ్రంథములందును నాంధ్రానువాదము
లున్నవానివంకఁ బోక యనువాదరహితములును అనుపలభ్యమానా
కరములు నగు శ్లోకములమాత్రమే యనువదించితిని. సామాన్య
ముగా నాలంకారికు లెల్లరును నొకే శ్లోకముల నుదాహరించుచు
వచ్చిరి.

ఆలంకారికు లేర్చికూర్చిన యా శ్లోకము లమృతతరం
గము లైనను ననువాదమునఁ గణము లయినవి. ఇది భాషాంతరీ
కరణ మాహాత్మ్యము. పై యలంకార గ్రంథములఁ జూడని కేవ

లాంధ్రవిద్వాంసుల కా రసతరంగముల రుచి చూపించు నుద్దేశముతో
నేనీ పనికిఁ గడఁగితిని. వీనిఁ జదివిన పిమ్మటనైనఁ దద్రసపూర్ణత
నాస్వాదింపఁగోరి మూలశ్లోకములఁ జదివి యానందింతురుగాకని
నా కోరిక.

కువలయానందము, కావ్యప్రకాశము, సాహిత్యదర్పణము,
చిత్రమీమాంస, చిత్రమీమాంసాఖండనము, కావ్యాలంకారసూత్ర
వృత్తి, సుభాషితరత్నభాండారము మొదలయిన గ్రంథము లీ
పొత్తమున కాకరము.

నా యీ చిన్నిపొత్తమునకు ముద్రణ సాహాయ్యరూపమున
గురుదక్షిణ సమర్పించిన నా ప్రియశిష్యుఁడును, ఆంధ్రభాషాభి
మానియు, సికింద్రాబాద్ వణిక్ఛిరోమణియును, వదాన్యతిలకుఁ
డును, రసికావతంసుఁడు నగు శ్రీ శిర్నాం సత్యనారాయణ గుప్తకు
నా ధన్యవాదములు.

గ్రంథకర్త.

# అమృతకణములు

ఆ. వె. కంటఁ గ్రాఁగినట్టి తుంటవిల్కానినిఁ
గంట బ్రదుకఁజేయఁ గలుగుదంట
లా త్రినేత్రు గెలుచు నాటోపము వహించు
వామనేత్రలకు నివాళు లిత్తు- ౧

చ. విలసిలు బావియొండు వినువీధిని; నాపయిఁ బైఁడిమెట్లలో
మలఁచిన యింద్రనీలమయమార్గముగ్రాలుఁ; దద గ్రమందు వ
ర్తిలును గిరిద్వయం; బదిసుకృజ్జనగమ్యముఁ జందనాంక;మా
స్థలమున కేగ లభ్య మమృతంబు సుధానిధియుంటఁ జెంగటన్.

కం. తన హృదయంబును జీలిచి
కొనివచ్చిన కలికి కటికగుబ్బలకవకుం
గనికర మనునది లేశం
బును గలదే లాఁతి హృదయమును జీల్పంగన్? ౩

కం. కనఁబడుచువచ్చె రాగము
మును నీ కెమ్మోవియందె ముఖ్యంబుగఁ గ్రొ
న్ననఁబోఁడి! యిప్పు డయ్యది
కనఁబడు నీ హృదయమునను గాఢతరంబై. ౪

కం. తలయెత్తి పయినిఁ గను చం
జలివ్రేళ్ళల నెడమెడంబు జరుపుచుఁ బాంథుం
డలజలము నానుకొలఁదిని
సలుపుఁ బ్రపాపాలి సన్నసన్నగ ధారన్.

కం. కల దనురాగము సంధ్యకుఁ;
జెలువుం డగు పవలు సతముఁ జెరలాడెడుఁ గ
న్నులముం; దైనను బొసఁగదు
కలయిక యెన్నటికి; దైవగతి యెట్టిదొకా ! ౬

చ. "తనరెడు నంచ ముక్కున క్షతంబగు మొగ్గలజంటతో సరో
జిని యిటఁ; గ్రోలి కోయిలత్యజించిన కెందలిరాకుతోఁడ గ్రా
లును నెలమావి" యంచుఁ దమలోఁ దమరాడఁ జెలుల్ సరస్తటిన్,
వినిచనుదోయి; బైటఁ, బెదవిం దన కేలనుమూసె నింతియున్.

కం. అవివేకి యగుటఁ జగ్గవ
యవిరతము జగత్త్రయంబు నలయించునుగా
కవునే శ్రుతిహిత మగు క
గ్గవ కివ్విధి లోకమారణముఁ గావింపన్ ? ౮

ఆ. వె. తెఱపిలేక మొగిలు కురియుచున్నది వాన ;
నిగిడి పురులు విప్పి నెమ్మిలాడు ;
నహహా ! కాంతుఁడో ? కృతాంతుఁడో ? నాదు దుః
ఖాంతమును బొనర్ప నరుగుదెంచు. ౯

కం. పొలయలుకను దొలఁగింపఁగఁ
జెలియడుగులయందు వ్రాలఁజేరెడు నాకుం
గలిగింపఁగ నుపకారము
బలముగఁ గ్రొమ్మొగి లదృష్టవశమున నుఱిమెన్. ౧౦

ఆ. వె. కాదు విసముచేతఁ; గాదు శస్త్రంబుచేఁ;
గాదు నిప్పుచేతఁ; గాదు మిత్తిఁ;
బ్రతికరింపరాని పరుసందనముఁగల్గు
స్త్రీలు స్త్రీలచే సృజింపఁబడిరి. ౧౧

ఆ. వె. కటికిరాలుదక్కఁ గనరావు కంటికీ
పల్లెకొంపలందు బాటసారి !
ఘనపయోధరములఁ గనుగొని నిలువంగఁ
దలఁచితేని నేఁడు నిలిచిపొమ్ము ! ౧౨

చ. ఇది జడగాదు కూర్చి మెలియిడ్డకురుల్; గరళంపుఁబిండు గా
దిది గళమందుఁ గస్తురిసుమీ! తలపై నెలవంకగాదు పొ
మ్మిది విరిగాని; కాదిది మెయిందెలిబూదెయువిప్రయోగమం
దొదవిన తెల్పు; నక్ బ్రమసితో హరుఁ? డంచలయింతువంగజా!

గీ. అతివకును సేమమే? యామె బ్రతికియున్న ;
దడుగుచుంటిని సేమంబు; నంటిఁగాదె
బ్రతికియున్నదియని; యదేపలికె దేల?
ఊపిరుండంగఁ జచ్చెనంటుచిత మగునె? ౧౪

కం. ఒకజాణకత్తె సంకే
తకాల మెఱుఁగందలంచు తన మిండనికిన్
సకులకడఁ గనుల నవ్వులఁ
బ్రకటించెను; గరవిలాసపద్మము మూసెన్. ౧౫

ఆ. వె. చెమ్మగిల్లి మోము చెమ్మటల్ జాల్వాఱ
నంటఁ గుంకుమంబు నళితియందుఁ
గాంచి చెలియ నగుచుఁ గలికి యమ్మగసేఁతఁ
దెలుప ఖడ్గలేఖ గిలికెఁ గేల. ౧౬

గీ. మొలిచెఁ గమలంబు నిర్జలస్థలమునందుఁ
గలువ లుదయించె దానిపైఁ; గానిపించెఁ
గనకలతపై నివెల్లు; నా కనకలతయు
లేఁతయఁట! యేమి యీ మహోత్పాతవితతి? ౧౭

ఆ. వె. చూచుకొనుచు సతము లోచనయుగళంబు
మురిసిపోదు వేల మోహనాంగి!
నలువలంకులందుఁ గల కొలంకులయందు
నిట్టి నల్లకలువ లెన్ని లేవు? ౧౮

కం. అతివా! వింటివె యీ య
ప్రతిష్ఠ? లోకంబునందు వ్యాపించెను; నీ
ప్రతిలేని మోముఁ బామరు
లతిమూర్ఖులు పోల్తురఁట! శశాంకునితోడన్. ౧౯

కం. తనమిందని కతలెల్లను
వినుచుచుఁ జెలియనుచు బ్రమసి వెలఁది మగనితో
మనమున నెఱింగి మగఁ డని
"యనంతరము మేలుకొంటి నతివా!" యనియెన్. ౨౦

మ. విరినిద్రుంపఁగఁజూచుమాత్రమునఁ గాన్పించెంగరంబెఱ్ఱనై
అరుణత్వంబు వహించెఁబాదములుపూయంగోరలాక్షారసం
బురియించెన్ మెయిపూఁతయన్ తలఁపు; నయ్యో! చెప్ప
నేముండె ? దు
ర్భరమైయున్నది సైఁపఁగా నగురుధూపంబే నధీరాక్షికిన్.

కం. సుదతీ ! యనుక్షణంబును
నెదుగుకొనుచువచ్చు నీదు నీ చన్గవ కె
య్యది చాలినంత దేశము ?
త్వదీయ కరలతల నడిమిభాగమునందున్. ౨౨

కం. ఆ యందం బా చందం
బాయా నెఱజాణతనము లా మాటతనం
బే యొడఁగన; మాసుందరి
యాయజుసామాన్యసృష్టి యగునే తలఁపన్? ౨౩

కం. 'చనుదు'నని 'చన'ననియును
మనఃప్రియుం డాడ రెండుమాట లపుడ జా
రెను మును ముంగటి గాజులు
వెనుకటివట గుత్తమగుట ప్రీలె వెలఁదికిన్. ౨౪

కం. నలుఁగుడు సైఁపంగల పు
వ్వులతీవలు లాఁతులుండెఁ; బొ మ్మచట మనం
బలరింపు; మేల యరజ
స్వలయగు విరజాజి మొగ్గఁబడి చెఱతు వళీ ౧౫

గీ. నీదు మువ్వల్వ దాఁచిన నాదుబంతి
నీఁగదే, రాధ! యంచు నా యింతి డాసి
చిలిపితనమెల్ల మొగమందుఁ జిందులాడఁ
బోకముడి విప్పి హరి మాకు మోదమిడుత. ౧౬

ఆ. వె. ప్రియుఁడ! నీదుయాత్ర పెద్దకాలం బింక
నన్నుఁ దపింపఁబోదు నమ్ము! నిజము!
వెడలవలసియున్న వెడలుము తడయక
శంక లెల్ల నొక్క వంకఁ ద్రోసి. ౧౭

కం. గిరిపై లత జనియించుట
నెఱుఁగుదు మీలోకమందు; నెఱుఁగము లతపై
గిరి జనియించుట; నిత్తఱి
గిరిద్వయము కనకవల్లికిని జనియించెన్. ౧౮

కం. తిలపుష్పంబును వెలువడి
మలయజ పరిమళము గ్రమ్మ మారుత మొలసెన్;
గలువలజంటను వెలువడె
ములుకుల మొత్తములు చిత్రముగ లోకముపై. ౧౯

ఆ. వె. "ఇది నపుంసకంబుగద!" యంచుఁ బ్రియురాలి
ప్రాంతమునకు మనసుఁ బంపియుంటి;
నది రమించుచుండె నటనె! హా! పాణిని
పలుకు నమ్మి గోతఁబడితిఁ జెడితి. 30

మ. పిఱుఁదుల్ వీడెఁ దనుత్వమున్; నడుము ప్రాపించెం దగన్ దానినిన్;
జరణద్వంద్వము పాసెఁ జంచలగతుల్; సాధించెఁ గన్దోయి; య
త్తఱి వక్షంబు కుచద్వితీయమును వక్త్రం బద్వితీయంబునై
పరగెన్; జవ్వనమిట్లు మార్చెగుణముల్ త్వద్గాత్రమందింతిరో!

కం. ప్రియుకై పంపితి దూతిక;
లయించె నది వానియందె, లంకెవడెను ద
ద్ద్వయమున కో సఖులారా!
అయితిని మతిలేనిదాని; నయితి నభాగ్యన్. 32

ఆ. వె. అలరుఁబోఁడి! నీదునవలగ్నమునకన్న
సూక్ష్మమగు మృణాలసూత్ర; మదియుఁ
బట్టదయ్యె! బెద్దబలిసిన నీగుబ్బ
చన్నుదోయినడిమి సందునందు. 33

గీ. మల్లెదండలు గైసేసి మలయజంబుఁ
బూసి యొడలికిఁ దొడి పట్టుపుట్టములను
బండువెన్నెల నడిరేలఁ బరువు లిడుచుఁ
గానఁబడదయ్యె నభిసారికాజనంబు. 34

కం. పలునొక్కులుగల తన కో
మలిమోవినిఁ గాంచి యెవడు మండిపడఁడు? నే
వలదన్న మూరుకొంటివి
వలపుగొని సభృంగమైన పద్మమును జెలీ! 3౫

నాయిక:—

కం. కలిగించెను సీత్కారము;
బలముగఁ గెమ్మోవిఁ బుండుపఱచెను; మేనిం
బులకించె;

సఖి:—

నాగరుఁడు నినుఁ
గలిసెనె?

నాయిక:—

యదిగాదు; శీతగాలి యిదిచెలీ! 3౬

చ. చనుఁగవతాండవింప జడసళ్ళఁగనూఁగఁగ ముత్తెపుఁ సరుల్
కనకపుఁ గమ్మలాడఁ జెవులన్ మిఱుమిట్లుగఁ జెమ్మగిల్లనా
ననముగరప్రహారములొనర్చుచుమిక్కిలియూర్చుకొంచు ని
వ్వనిత కరంగుఁ గందుకమ!భాగ్యమనంగనునీదెపో! భువిన్.

ఆ. వె. మొదటఁ గ్రిందనున్న పువ్వు లేఱి లతాంగి
కొమ్మనున్న వానిఁ గొనఁదలంచి
నడుగు నిడ నశోకమం దెక్క నదియును
మొదలినుండి మరల మొగ్గదొడిగె. 3౭

ఉ. అంచలగర్వభంగమగు నా సతియానవిలాసముం గనన్;
గాంచును మౌనవృత్తినిఁ బికంబులు ముచ్చట లాలపించినన్;
గాంచిన మేనిమార్దవముఁ గన్పడు జాజియు రాతియట్లు; వీ
క్షించిన నంగశోభ సిరి సిగ్గిలి తాల్పదె కావిపుట్టమున్ ?

ఆ. వె. ఏ గిరీంద్రమందు నెంతకాలంబుండి
యే తపం బొనర్చె నీ శుకంబు ?
పువ్వుఁబోఁడి ! నీదు మోవివోలెను గెంపు
లుఱుకు బింబఫలముఁ గొఱుకుకొఱకు. ౪౦

చ. "చెదరినముంగురుల్ సరిగఁ జేర్పుము చెల్వఁడ! బొట్టుదిద్దుమీ
నుదుట విలాసి! కూర్పుము చనుంగవఁ ద్రెస్సిన ముత్తెపుసరుల్
హృదయసఖుండ!" యంచు వచియించిర తాంతమునందు వానితా
కుదలకొడల్ గగుర్పొడువ, గోమలి క్రమ్మఱఁ బొందె మోహమున్.

కం. సతి ! యెంత ధన్యురాలవె !
రతినడుమం బ్రియునితోడ రమణీయకథా
శతము వచింతువు; నాకో
స్మృతిపోవుఁ బ్రియుండు నీవి స్పృశియింపఁగరాన్. ౪౧

కం. కనులన్ రాలిన పుప్పొడిఁ
దన వదనానిలముచేతఁ దలఁగింపఁగఁజా
లని ప్రియునిఁ బొడిచెఁ బీన
స్తని యొకతె పయోధరమునఁ దద్వక్షమునన్. ౪౩

గీ. కాల మామని; కాముండు గండుబౌఱెఁ;
దీండ్రముగ వీచుఁ జల్లని తెమ్మెరలును;
దావు వంజులకుంజకేళీవనంబుఁ;
దవులఁ బఠి; తెల్పు మిపుడు కర్తవ్య మేమొ? ౪౪

చ. కనుఁగొని యొఱ్ఱవారిన మొగంబును ముద్దిడఁబోతి;నత్తఱిన్
ననునొకతన్నుఁదన్నెఁజరణంబున; నవ్వుచుఁ బట్టుకొంటి దా
నిని; నపు డేమి సేయుటకు నేరక కన్నులనీరు రాల్చుచున్
ననుఁగనుకల్కి-యయ్యలుక నాకునఖా! కుతుకంబొనర్చెడున్.

కం. అనలంకృతుండ వయ్యున్
మనోజమూర్తీ! హరింతు మనము బలిమి న
వ్వనితానఖక్షత విభూ
షణములు దాల్చితివి నిన్ను సాధ్యమె పొగడన్. ౪౬

చ. కలుగవు నాకు మేల్నగలు గాత్రమునం; గనరాదు వన్నె వ
ల్వలపసయున్; హుళక్కి నడలన్ హొయలన్; మొగ
మందు గండ్ర న
వ్వులుఁదిమురుంగనంబడ;వవున్;సుభగుండయినంబరాయిచె
ల్వలఁగనఁ డీపెనాథుఁ డని పల్కు జగంబు సహింపకో సఖీ!

చ. అతివరో, నీవెనాకుఁబ్రియురాలవునుమ్మనియన్నమాటసూ
నృతము;ప్రియోపభుక్తరమణీయముచేలముఁదాల్చి యేగుదెం
చితి విటునాగృహంబునకుఁ జెల్వఁడ! కామిజనంబుమండనం
బతిసఫలం బగుంగద యథార్థముగా నిజకాంత కాంచినన్.

ఆ. వె. చియ్యఁ బట్టి యుంటఁ దొయ్యలి ప్రియుతోడి
రతులఁ జాటెవింత చతురిమంబు,
శిష్యవృత్తి సంతఁ జెప్పించుకొన్నట్లు
పావురాలు మణితఫణితిఁ గఱచె. ౪౯

మ. మగఁడా! ఊర్చినఁ బ్రేవులెంచు; సవతుల్ మచ్చిత్తముం
ద్రవ్వెఁచూ;
త్రగునాయత్తగయాళిపట్టుఁబసి; యేరాండ్రా! దృగంతంబులం
దగభేదింతురు;నిష్ఫలంబుశ్రమ;కన్నన్నల్వృథా!పొమ్మిటన్
వగలాఁడా!యిదెదాలనుండియెనమోవాకంబునర్పించెదన్.

చ. అడుగిడు మెల్లమెల్లభువి; నంతిపురంబును వీడిరాదెటుల్;
దుడుకున నవ్వఁబోఁదు; మదిలో నిముసంబునఁగొన్న సిగ్గునం
గడబిడఁబొందుఁ; బల్కు–నుగొలంది గభీరిమ, కొద్దివక్రిమం
బడర;నిజప్రియుం గుఱిచియాడుచెలింగను నెత్తి భ్రూకుటిన్.

మ. తనుఁజూడంగను గ్రిందఁజూచును; సమాధానంబు నీదేమియ
న్నను; సిగ్గంబెడమర్లిపండు;బలిమిం గౌఁగింటఁ జేర్పన్ వడం
కును; బోఁజూచుఁ జెలుల్ గదిన్ వెలువడన్ గూర్చుండదుం
జెంత; నా
కునవోఢాంగనవామవృత్తముననేకూర్చెన్ మనఃప్రీతినిన్.

గీ. కంకణంబులఁ బైకొత్తి, కటి బిగించి
మేఖలను, మాన్చియందెల మేటిరొదలు,
పోలఁతి! యభిసరణోత్సవంబునకుఁ బూన
దీసెఁ జండాలుఁ డిందుండు తిమిరపటము. ౫౩

మ. వినఁగానైతిఁ దదీయచాటురచనల్; వీక్షింపఁగానైతిఁ; దె
చ్చినహారంబుఁ బ్రియానులాపములుభాషింపంగనైతిం; బదం
బునఁగైవ్రాలిప్రియుండు వెంటనెచనెన్; మూఢాత్మనై యేలొకో!
చనునప్డాపి కరంబులన్ వడిమెడన్ సంధింపనైతింగటా! ౨౪

కం. "లేవే! దూతీ! మన మిఁకఁ
బోవుద; మతఁ డింతప్రొద్దుపోయిన రాఁడీ
తావున; కీపయి నెవ్వత
జీవించు నతండు దాని జీవేశుఁడగున్. ౨౫

గీ. డాలఁద్రోయుము! వలదంగదములు చెలియ!
బరువు గ్రైవేయకము, రత్నవలయములును
గ్రొత్త యేకావళి నొకండు కూర్చు మేన
దగవు మదనోత్సవములందు దండినగలు. ౨౬

చ. "కరములనాఁపెనో? యెవతెకాని? యదల్చెనొ నాదుదూతి; యే
గురుతరకారణంబొ? యిటకుంబ్రియుఁ డిప్పటికేని రాఁడ" యి
క్కరణిఁ దలంచివ్రాల్చి ముఖకంజముఁ బాణితలంబునందు న
త్తరుణి రుదించు నూర్చుఁబువుదండలు డాలకుఁ ద్రోయుఁ జింపుచున్. ౨౭

ఆ. వె. కౌఁగిలింపఁ దమ్ముఁ గౌఁగిలించుచు బిగ్గ,
ముద్దులాడఁ దమ్ము ముద్దుగొనుచు,
మోవిఁ గఱవ రేఁగి మోవినిం గఱచుచుఁ
జెలులు ప్రియుని దాసుఁ జేసికొండ్రు. ౨౮

గీ. పరగఁ దమ్మితూఁటిపాఁపకడెంబులు,
పరల వేణి యను కపర్దకంబు,
హరుని ననుకరించు నా పార్వతీదేవి
లీలతోడ లోక మేలుఁగాక. ౫౯

ఆ. వె. తానమునఁ గడింది తళతళమను మేను,
తమ్ములమునఁ గెంపుఁ దాల్చు మోవి
జిలుఁగువలువ; యివియ చాలును వగలాఁడి
కలరువిల్తుఁ డెడఁద మొలిచియుండ. ౬౦

చ. ప్రియుఁడు సతంబుఁదమ్మనుసరించినఁదప్పులువట్టుచుండ్రు; నె
మ్మొయినిఁద్యజింత్రుగాని ప్రియుమీఁదనిగుడ్పరునింపుచూడ్కి నె
మ్మొయినిఁ; బొనర్తుపో! నిజసమీహితమందునిషేధ; మీఁజగ
త్త్రయినివిలక్షణప్రకృతిఁదాల్చినవామలు నాకుఁగూర్చుతన్.

క. స్వమనోరథంబులకు భం
గము రానట్లడ్డగించుఁ; గలికి నవుల యం
దముతోఁ దర్జించును బ్రియు;
సుమాంగి కల్లేడ్పు లేడ్పు సుఖమగ్నయునై. ౬౨

ఆ. వె. మోహనాంగ! నీదు ముచ్చట లెత్తంగఁ
గోమలాంగి చెవులు గోఁకికొనుచు
నావులించుకొనుచు హర్షాశ్రువులు రాల
నొడలు విఱుచుకొనుచు నుండుసుమ్ము. ౬౩

కం. తలిరాకు చుట్టమగు నా
చెలి కెమ్మోవినిఁగనంగఁ జెలువుండు కరం
బులనున్న కంకణంబులు
గలగలమనె నేదో! బెడఁద గలిగినకరణిన్. ౬౪

కం. తన ప్రియుఁడు వచ్చె వాకిట
కని సొగసుం జేసికొనుచు నంగనవిని యం
జనమును నొసటను, లత్తుకఁ
గనులను, దిలకంబుఁ బెట్టె గండస్థలిపై. ౬౫

గీ. నాదు నునుజెక్కిళులపైని నాయకుండు
స్వయముగా వ్రాసెఁ బుష్పమంజరి నటంచు
మురిసి పోఁకిట్టి వన్యయుం బొందకున్నె?
పాడువణఁకట్టిచో విఘ్నపఱపకున్న. ౬౬

మ. కడునిట్టూర్పులువుచ్చుఁ; నేలఁబొరలున్; గాంచున్ భవన్మార్గమె
ప్పుడు; బిట్టేడ్చుఁ; గృశీభవించినకరంబుల్ వేయునట్టిట్టులున్
బడయంగాఁగలనైన నీకలయికన్ వాంఛించు నిద్రింపఁగా
నిడఁడద్దానినిఁగూడఁ బాడువిధి యోయీ! యెంత
నిర్భాగ్యయో? ౬౭

కం. చెలికాఁడ! నాదు కంకణ
ముల ముద్దులుమూటఁగట్టు ముక్తాఫలముల్
గలవే వృక్షంబుల? నే
స్థలంబునను; నాఁటి రెవరు? సరిగఁ దెలుపవే? ౬౮

కం. అఱవిరిసిన వేనలితో
నఱదీర్చిన బొట్టుతోడ నళుకునుగొన్న
ట్లరయుచు దెసలం బ్రియుతో
జరుపును గోమలి రహస్యసంభాషణముల్. ౧౯

ఆ. వె. *తోడలమీలు దాఁకఁ గడుఁ దత్తఱించుచు
వింత హాయలుచూపె నింతి యొకతె
చెలు లహేతువుగనె చేయుచుంద్రు విలాస
ములను; హేతువున్నఁ దెలుపవలెనె? ౨౦

కం. కురఁగట నిలిచిన నన్నుం
జరికించియుఁ బువ్వుఁబోఁడి పరికింపని య
క్కరణిని నఖక్షత మనో
హరమగు తన బాహుమూల మటఁ గనపఱచెఁ. ౨౧

గీ. బాటసారి! దప్పివడినట్టు లుంటివి !
యేల యవలి కేఁగె దిచటినుండి
లేర యెవరు నిచట వారించువారలు
చాలినంత రసముఁగ్రోలి పొమ్ము ! ౨౨

గీ. ఇరులపయ్యెంటజాఱంగ, మరులుగొనుచు
నుదయశైలస్తనాగ్రమం దునిచికరము
కలువకన్నులు వికసింపఁ, జలివెలుంగు
అమరపతి దిఙ్ముఖంబు ముద్దాడుచుండె. ౨౩

*ఇది జలక్రీడావసరమునందలిది.

ఆ. వె. అరముడుంగుఁ గన్ను లా యింతిమెయి సోఁకఁ;
బులకరించి జడిమ మొలయు నొడలుఁ;
జెక్కుఁగిళులుఁ జెమర్చుఁ జిత్త మానందమ్మొ
బ్రహ్మపదము ముట్టుఁ బాసి జగము. ౭౪

మ. పిదపన్ నిద్రిలి ముందె మేలుకని యుద్వేల స్మర క్రీడలం
దుదితాయాసముచేత స్వాపసుఖమం దున్నట్టి ప్రాణేశులన్
బ్రిదులంజేయక బిగ్గకౌఁగిళుల గ్రింధిన్ స్వీయగాత్రంబులం
గదలంజేయకయుంద్రు జవ్వను లుషఃకాలంబు కావచ్చినన్.

గీ. త్రావి ముమ్మారు మద్యంబుఁ, బూవుఁబోండ్లు
గం డ్రతన మొంది వక్రోక్తి గండుమీఱి
తమ రహస్యంబు లుద్ఘాటితము లొనర్చి
కేరలి నగుచుం బరిహాస కేళిఁ దగిరి. ౭౬

గీ. అన్న! భృంగంబ! భ్రమియింతు వఖిలదిశల
నాదు వలపులరాణి కన్పట్టెనోయి!
'ఔ'నటందువు సఖ! తెల్పు మాలసింప
కెచటఁ గల? దేమి కావించు? నెట్టి దామె? ౭౭

కం. చెలికాఁడ! నీదు డెందము
నెలవగుటం బెక్కుమంది నెలఁతల కందా
చెలి తన్నిముద్చుకొన ని
చ్చలుఁ దన లేమేని నతికృశం బొనరించున్. ౭౮

ఆ. వె. *తొడలఁ బొడువ మీలు చిడిముడిపాటొంది
వేల్పుచెలులు కనులు బిత్తరింప
హస్తపల్లవముల నట్టిట్టు విదలించు
చైరి దర్శనీయ లాఘులకును. ౨౯

కం. రమణీ! నీ యీ వాల్జడ
కమనీయంబయ్యెఁ గుటిలఘనచికురకలా
పముచేఁ; జీల్చు నయోదం
డమువలెఁ; నలత్రాఁచువలెను నన్నుం గఱచుఁ. ౩౦

గీ. విచ్చఁబాఱిన తామరపువ్వుతోడఁ
బొత్తుపొసఁగని జాబిల్లి పొత్తుఁగూర్చ
నేమి చింతించుచుంటివె, యెడఁదయందు?
చెంపపయిఁ జేయిఁ జేరిచి చిగురుఁబోఁడి! ౩౧

కం. విరియంబాఱఁగ వావిలిఁ
బరికించియు నెట్టొపట్టి ప్రాణము నిలిపెం
దరుణీమణి; యీపిమ్మట
నెఱుఁగుము విని కోఁడికూఁత నేమగునో? కటా! ౩౨

గీ. ముసరఁగా నిమ్ము! జుమ్మని దెసలఁ దేంట్లు
మలయఁగానిమ్ము! మెలమెల్ల మారుతంబు;
పాడఁగానిమ్ము! కోయిలల్ పంచమంబు;
సరుగఁగానిమ్ము! నా యయఃప్రాణములును. ౩౩

*ఇది జలక్రీడావసరమునందలిది.

ఆ. వె. నిజముఖానిలమున నెయ్యుఁ దూఁదుచునుండఁ
బొలఁతికనులఁ బడిన పూరజంబు
నచటఁ గాంచునవతి యక్షియుగ్మమునందుఁ
గోపరజము నిండెఁ గొలఁది మీఱి. ౮౪

గీ. ఉత్తరీయంబుఁ గప్పి గోకొత్తు దాఁచి
మోవిపల్లొత్తు దాఁతువు మూసి కేల
కాని యన్యాంగనాభోగకథలఁ జాటు
కమ్మవాసన లెట్లింకఁ గమ్మఁగలవు ? ౮౫

చ. స్తిమితత నొందెఁ జింతలకుఁ జిత్తము; చెక్కిలి కేలవ్రాలె; నా
స్యముకళదప్పె నౌషసమృగాంకునిరీతిని; బుండువాఱె శ్వా
సములకు మోవి; చల్లఁబడఁజాలదు తాపము శీతలోపచా
రముల; కెవండు దీనిదశఁ బ్రార్థిత దుర్లభుఁడై సహించునో ?

మ. చనుదున్ సుందరి! పాంథుఁడా! చనుము! నీస్వాంతంబునన్ శోకముం
గనఁగాఁబోకుము! శోకమెందుల; కిఁకం గన్నీరురాల్చేల? వే
చనవైతంచునె; తొందరేలననుఁబుచ్చన్ నీకు? నీతోడఁబో
వనె వాంఛించుచు నిట్లువేగపడు నాప్రాణంబు లత్యంతమున్.

మ. అతివా! నేమమె? నాశరీరము కృశంబై నేమమైయుండె; నె
క్కటితనంగ్రుస్సెను నీయెడల్ ? బలిసి నీగాత్రంబు వర్ధిల్లుటన్
సతి ! నాకీబలు పేలకల్గెనె ? ప్రియాస్పర్శంబులం జేసి; యె
వ్వఁతెనాకుంబ్రియనీవుగాక; యగుచోఁబ్రశ్నింతువే నేమమున్.

మ. మగఁడా! మోటుమనుష్య; డీవనము నిర్మానుష్య; మేబాల; నొం
టిగనుంటిన్; బహుళాంధకారములు నిండెన్ నల్దెసల్ మూసికొ
న్నగతిన్ గావునదారివీడు వెసఁగృష్ణా! మోహనాకార! యం
చొగిఁబల్కాఁడు వ్రజాంగనంగలియు శ్రీయుక్తంపు
మిమ్మోమ్ముతన్. ౧౯

గీ. పిన్నలేఁగొను నాకుఁ దీవియ బిగించి
కొండమల్లియ క్రొవ్విరుల్ కోసి తెచ్చి
కోయజవరాలు కూర్చుండి కొండపైనిఁ
గురులు ముడిపించుకొనెఁ దన తరుణుచేత. ౨౦

మ. పొరుగమ్మా! నిముసంబు మాగృహము వై పుంజూచుచుండమ్మ నే
నరుదెంతున్ వడి నేటినీటిఁ గొని; యేలా! యింతదవ్వేఁగ దీ
యిరులందందువొ? బావినీళులను మాయింటాయ నానందు; నే
భరియింతుం బలుముండ్లచెట్లూరసి త్రోవన్ నాయెడల్ చీరినన్.

కం. ఆయందం బాచందం
బాయాలాప క్రమంబు నాసమయమునం
బీయూషధారయై యిడె
హాయిని; నన్నిపు డలంచె నది పెనుజ్వరమై. ౨౧

చ. జలకములాడి సంజతఱి చందనలేపము గాత్రవల్లికిన్
అలఁదితి; వస్త్రమించె జలజాప్తుఁడు; వచ్చితి మెల్ల మెల్ల నీ
నెలవున; కెంతకోమలమొ! నీయెడలిప్పుడు సల్లువాఱె; మూఁ
తలు వడకుండ నుండవుగదా! కనుదమ్ములు నీకు సుందరీ!

గీ. బటువుగుబ్బలజంటయు, వాలుచూపుఁ
బఱవ, ద్వారంబున న్నిల్చి వచ్చుపతికి
సలిపెఁ బూర్ణఘటంబుల, నలరుదండ
తోరణ, నయత్నమంగళాచార మింతి. ౯౪

శా. ఆహారంబునుమాని,పూనివిషయవ్యావృత్తినిం, జిత్తముం
'సోహం'వృత్తికిఁ ద్రిప్పి నిల్వఁబడ నాసాగ్రంబునంజూపు,వా
గ్రాహిత్యంబువహించి శూన్యముగ లోకంబెల్ల భావింతువో
హాహా! యోగినివో? వియోగినివొ? నాకోసీ! చెలి! చెప్పవే!

ఆ. వె. తప్పొనర్చు దాసుఁ దన్నుట సుందరీ !
ప్రభుల కుచితమగుటఁ బరితపింపఁ;
గలికి! మత్కఠోరపులకకంటకపంక్తిఁ
ద్వత్పదంబు లెంత బాధపడునొ? ౯౫

కం. తద పాంగ మొకఁడు నాకిడి
మదీయహృదయంబు మూలమట్టుగఁ గొనె నా
మదిరాక్షి; యిచ్చి నేనును
హృదయము మదనజ్వరము గ్రహించితినిఁ గటా! ౯౬

ఆ. వె. అహరహంబు హారమట్టెట్టు తూలుచుఁ
బూవుఁబోండ్ల చనులఁ బొరలుచుండుఁ
బొందు నీయవస్థ ముక్తావళియు; నింక
స్మరుని కింకరులము మన కెంత?. ౯౭

చ. నెలఁతనితంబముల్ నడిమినిండుతనంబుహరించె; జొమ్ములం
గలక్రశిమంబులాఁగికొనెఁగాను; గ్రహించెను రోమవల్లి క
న్నుల ఋజువర్తనంబును; మనోజుఁడు గద్దెకురాఁగఁగ్రొత్తగా
బలిమినిదోఁచుకొన్నటులువర్తిలెనొండొరులందదంగముల్.

కం. కలయిక యెడఁబాటులలో
నెలమిని నామదికిఁ గూర్చునెడఁబాసె కడుం;
గలయిక నొకతయె; పలు రూ
పులఁజెలి యెడఁబాటునందు ముందు నటించున్. ౧౦౦

చ. తనగతి సౌకుమార్యము పదంబులఁ, బెందొడలం గరంబు,న
క్కునగురుకుంభయుగ్మమునుగూఁటిచె;నిక్కరణిన్ గజంబు నీ
తనులత నాక్రమించుకొనుఁదన్వి!క్రమంబుగ; జాగుసేయ కిం
కను హరినైన నన్ను వడిగా శరణొంది సుఖింపుమింపుగన్.

* కం. నవతాండ్రయెదుట దయితుఁడు
పువుదండను గ్రుచ్చి వక్షమున నిడఁ జెలి దా
ని విడదు తడిసిన; వలపునఁ
బ్రవర్తిలును బొలుపు "నాస్తి" వస్తువులందున్. ౧౦౨

కం. చెలువల సావాసముచేఁ
గలుగుంబో! దిట్టతనము కడిఁది జడులకున్;
గలుకుల కుపదేశించును
గులుకులఁ బ్రాయంపుఁదిమురు క్రొంగ్రొత్తగతిన్. ౧౦౩

---

* ఇది జలక్రీడావర్ణనమునందలిది.

కం. తరుణీమణి ! చూడవె! రా
తిరి నటనటఁ దిరిగి కడపి తెలవాఱఁగ భా
స్కరుఁడు వియోగకృశాంగిని
సరోజినిం బాదపతనసత్కృతిఁ దేర్చెన్. ౧౦౪

కం. నిలఁబడి నీముందెవ్వఁడు
కలికీ ! కలిగించెఁ గనులఁ గళుకుల్ తళుకుల్ ?
కులికించెను గనుబొమలను?
బులకింపఁగఁజేసె గాత్రము మనోజ్ఞముగన్? ౧౦౫

కం. కలిగించుచుండు వెన్నెల
వలెఁ గన్నుల కెలమిఁ; గల్లువలె మత్తు నిడున్
గెలనికి నాకర్షించును
బలువుర నా పువ్వుఁబోఁడి ప్రభుతవపువునన్. ౧౦౬

కం. ఎలజవ్వన మెఱయింపఁగ
విలాసముల నొడలిప్పెని, విరివిల్తుండున్
ఇలుద్రొక్కి మొసరువెట్టఁగఁ
గలఁపదె? చెలి తపసినేని కనుచూపులచేన్. ౧౦౭

కం. చెలువపుసిరి, యొలప్రాయముఁ
దళుకులు బెళుకులును గలుగు తన్వీమణి పు
వ్వులదండ తేంట్లవలెనే
వలకాండ్రను లాఁగకుండు వలనికి? సఖుఁడా! ౧౦౮

ఆ. వె. తమ్మితీఁగభాతిఁ దనరు నా జవరాలి
తమ్మిఁబోని నెమ్మొగమ్ముఁ గ్రమ్మి
గండుతేఁటికరణిఁ గమ్మని తేనెలు
గ్రోలిక్రోలి తనివిఁగొంటి లెస్స.

గీ. చన్గవ వలుందతనముఁ, బెన్సన్నఁదనము
కవునున, వెడందతనముఁ గన్గవను, నిండు
తనముఁ బిఱుఁదులయం, దెఱ్ఱఁదనము మోవి
మించు శివురాణి సాక్షాత్కరించుఁగాక.



కం. రమణీమణి తనువల్లరిఁ
గమనీయము రోమలత ప్రకాశిలు నైమ
ల్యముచే స్ఫుటముగఁ బ్రతిబిం
బముఁ దాల్చెనొ? వెనుకనున్న వాల్జడ యనఁగన్.

కం. జవరాలి చన్నుదోయిని
యువకుఁడు చూచుచు శిరస్సునూఁచుచు నిలిచెన్
అవగాఢంబుగ నందుం
దవుల్కొనిన చూపు వెలికిఁదలఁచిన కరణిన్. ౧౧౨

కం. హరి యూరేఁగుచుఁ ద్రోవను
సరిగా సిరివోలెనున్న సతి నొక్కతి బం
గరుబొమ్మఁ గాంచి సంశయ
పరుఁడై వీక్షించుకొనియె వక్షఃస్థలమున్. ౧౧౩

కం. చెలి చెక్కుటద్దమును దిగి
వలుందగుబ్బపయిఁ బడెడు వక్రాలక మా
చలివెలుఁగునుండి మేరువు
తలపైకిం బ్రాఁకు నల్లత్రాఁచన మెఱసెన్. ౧౧౪

గీ. చలితతారకమైన నిశాముఖంబు
రాగమున ముద్దులాడఁ జంద్రముఁడు రాఁగ
నదియు రాగంబుచేఁ దమిస్రాంబరంబు
జాఱినను ముంగలనఁ గాంచఁజాలదయ్యె. ౧౧౫

ఉ. నీవు చివుళ్ళ జొంపముల, నేఁ బ్రియురాలిగుణాలి రక్తుఁడన్;
నీవయిపట్లు నావయిపు నిచ్చ శిలీముఖపంక్తి వచ్చుఁ; గాం
తావరపాదఘాతము ముదం బిడు నీకటు నా; కశోకమా!
నీవును నేను దుల్యులము; నేనె సశోకుఁడనైతి దుర్విధిన్. ౧౧౬

కం. వదనంబు వెల్లఁబాఱెను
హృదయము పరసించె; నొడలు నివ్విధి వడలెన్;
గుదరనిరోగం బెయ్యదో?
సుదతీ! నీకున్నయట్టి చొప్పివి చెప్పన్. ౧౧౭

కం. మొలకెత్తఁ జిగుర్పఁగ, మొ
గ్గలు దొడుగం, బూలుపూయఁగ రసాల మికో!
మొలకెత్తెఁ, జిగిర్చెను, మొ
గ్గలు దొడిగెన్; బూలుపూచెఁ గాముండు మదిన్. ౧౧౮

కం. జవరాండ్ర చిన్నెలకునుం
గవీశ్వరుల మధురభావగతులకుఁ గానీ
యవధియు నుండదు; వానికి
నవనిం బునరుక్తిదోష మంటదు లవమున్.   ౧౧౯

కం. విలుకాం డ్రెల్లరు నలుపం
గలుగుదు రొకదాని రెండుగా నిల; నా పు
వ్విలుకాఁ డొక్కఁడె నలుపం
గలుగును రెండింటి నొకటిగాఁ జిత్రముగన్.   ౧౨౦

కం. లలనాతిలకము వెలిగాఁ
గలదే యమృతంబుగాని గరళముగానీ
కలుగు బ్రదుకు తత్సంగతిఁ;
గలుగును మృతి తద్వియోగకలనఁ గటకటా!   ౧౨౧

కం. కనుదోయిఁ గజ్జలంబును
దనూలతకు దువ్వలువయుఁ, దములపుబెజ్జం
దనమును మోవికి; నిదె భూ
షణ మితరము దూషణంబు జవరాలి కిలన్.   ౧౨౨

కం. అమృతము బింబాధరమున
నమృతము ముచ్చటలయందు నమృతము కనులన్
అమృతఘటంబులు చన్నులు
ప్రమదామణి సృష్టిగాదు బ్రహ్మాది తలఁపన్.   ౧౨౩

కం. తరుణీమణి వేణీలత
పిఱుఁదులపైఁ బడుచుఁ దరుణబృందమును గడున్
వెఱపించెడు పువ్విల్తుని
కొరడాచందమున నెలమిఁ గూర్చుచునుండెన్. ౧౨౪

కం. తనచూపుతూపులను గ్రొ
న్ననఁబోఁడి కడింది దాఁకి నాలుగడుగులం
జని చచ్చెనొ? లేదో? యని
వెనుదిరిగియుఁ దరుణుఁ గాంచుఁ బెక్కుతడవలన్. ౧౨౫

కం. దయితుం డెదుటికి రాఁగాఁ,
బ్రియ సల్లాపంబులాడ వెస నా సర్వా
వయవములు కన్ను లవునో?
అయిపోవునొ చెవులు తెలియనయ్యెద సకియా! ౧౨౬

ఆ. వె. కుసుమపువ్వవన్నె గొనబుపుట్టముఁ గట్టి
కడవఁ దలను దాల్చి కలికిమిన్న
కాంచువారిహృదయకమలంబులను గోసి
యునిచి దానియందుఁ జనుచునుండె. ౧౨౭

కం. కనఁబడకుండిన నిన్నుం
గనఁగా నువ్విళ్లుగొందుఁ; గనిపించినచో
జనుదువని వెఱతు; నిన్నుం
గనకున్నను గన్న నాకుఁ గలుగవు సుఖముల్. ౧౨౮

కం. మఱువకుము సుందరీ! నను
స్మరియింపుము! నిను స్మరింపఁజాలను సుమ్మీ!
స్మరణంబు మనోధర్మము
తరుణీ! హరియించి తీవె దాని నిఁకెట్టుల్. ౧౨౯

ఆ. వె. ఎచటి కేఁగుచుంటి వీ నిశీథమునందు
యువతి ! హృదయనాథుఁ డున్న యెడకు
ఒంటరిగఁ జరింప నోటలేదే నీకు?
సాయముగను బంచశరుఁడు లేఁడె? ౧౩౦

శా. మోఁకాల్మోడ్చి, పిఱుందులన్ మడమలన్ మోపించి, ముం దద్దమా
లోకంబుం బొనరించుచుం, గుచగిరుల్ త్రుళ్లాడఁ గేలెత్తుచుం
బైకిన్ వ్రాల్చుచు, మ్రోఁగగాజులుకురుల్ నానాగతిన్ దువ్వుచున్
ఆ కన్యామణి కట్టుచుండెముడియో? అస్మచ్చలచ్చిత్తమో?

కం. వలరాజు వాఁడిపువుట
మ్ముల సొమ్మంగొన్న యువసమూహము చిత్త
మ్ములఁ దేర్చును యువతీజన
ముల స్మితపీయూషరస మమోఘౌషధమై. ౧౩౨

కం. ఎఱుఁగుదు మమృతము; తేనియ
తెఱుఁగుదుము; రసాలఫలము నెఱుఁగుదుముగదా!
ధర లోఁతి గలదె? శాంతా
ధరంబుకొఱకెను మధురపదార్థముఁ జెప్పుఁడా! ౧౩౩

కం. తనుఁ గౌఁగిలింప దయితుఁడు
గనుత త్తఱపాటుఁ గాంచి కాఁబోలును బ
క్కున ముత్తెసరపు రూపున
స్తనద్వయము నవ్వుచున్న సరణిని మెఱసెన్. ౧౩౪

కం. కలియఁబడ రదనకాంతులు
మెలివడఁ గ్రేఁగనులు, పెనయ మెయిదోయియు, మో
ములు గ్రిందుమీఁదులంబడ?
విలాసిమిథునంబు వెలసె విరిపాన్పుపయిన్. ౧౩౫

మ. చెలువా! మద్యము నీవు త్రావఁగను నాచిత్తంబు మత్తిల్లె వ
త్తిలఁగాఁగుంకుమచర్చ నీయొడల రక్తింగొంటివే; నీవు చ
న్నులభారంబున మెల్లఁగా నడవఁగాం తుం దొట్రుపాటేను; గం
పిలఁగా నీనడుమూఁడె నాధృతి; యహో ప్రేమక్రియల్ చిత్రముల్.

మ. తలఁకం బోకు శశాంక! నాదు మధుపాత్రన్ లేఁడు లేరాహు! పి
వళుకుంబొందకుముండె లే! గగనమం దారోహిణీకన్య ద
వ్వుల; నౌలెమ్ము! తుటారి కత్తెలగుపువ్వుం బోండ్లతో టక్కటమిం
జెలియించున్ మగవాండ్రిచి త్తమిటనాశ్చర్యంబు లేదేమియున్.

కం. తనకటిని ద్రిప్పి కెలనికిఁ,
గనఁబఱచుచుఁ గుచతటంబుఁ, గరమున హారం
బును బట్టి యుఱక సర్దుచు,
వనితామణి మరులు రేఁగి పరికించె ననున్. ౧౩౮

కం. వనితా! వెలుపలఁ దిరుగక
చనుమీ! లోపలికి; గ్రహణసమయ మిది సుమీ!
కని భవదకళంకానన
మును రాహు హరించు వదలి పూర్ణశశాంకున్. ౧౩౯

కం తరుణీమణి! నీచన్నులు
పరకాయింపంగఁ జక్రవర్తులుసుమ్మీ!
కర మర్పింతువు కనుక నె
నిరతము మారాజ వయ్యె నీవు ప్రియుండా! ౧౪౦

కం. తరఁగలగముల సముద్రుఁడు
నురుగుల గందంబుఁ గడిఁది నూఱెడు; దానిన్
గరములఁ గొని చంద్రుఁడు ది
క్తరుణీరత్నముల కలఁదుకరణిం గ్రోలున్. ౧౪౧

గీ. అంగుళులచేతఁ గచసమూహంబు నట్లు
కిరణములచేతఁ దిమిరంబుఁ గెలనఁ ద్రోచి
ముదుఁగఁ దామరకన్నులు మోహకలనఁ
జందురుఁడు ముద్దులాడు నిశాముఖంబు. ౧౪౨

మ. కలికీ! యిమ్మునఁ దమ్మిపువ్వుగొడుగుం గల్పించి తాల్పంగని
క్కాలన్ బీజమునాటుచుంటివకటా! కొండంత పేరాసతోఁ
గలికాలంబిది; యీజగంబు నకృతజ్ఞం; బుండినట్లుండి దాఁ
గలుసుమ్మీ! యదినీమనోజ్ఞముఖలక్ష్మిన్ రెండుమూన్నాళ్ళలోన్.

గీ. ఆ శశాంకుండు స్వకళంక మపనయింపఁ
ద్వన్ముఖంబయ్యెఁ; గాని యద్దాన దిద్ది
తిలకముఁ గళంక పఱపయత్నింతు వింతి !
అతివలు కళంకపఱతురం డ్రాశ్రితులను. ౧౪౪

కం. బొమవింటి నెత్తి యెంతగ
రమణీమణి వంచునంత గ్రక్కదలియు డెం
దము దాని చూపుతూపుల
గమిచేతం దూఁట్లు తూఁట్లుగా నయ్యెఁజుమీ! ౧౪౫

చ. కలువలరాయ! నీ వెడఁదగట్టిగఁ గైకొనఁ గోరితేని నా
వలపులరాణి మోముసిరి వారిధికిం జని వేసి నాల్గుము
న్కలు స్వకళంకముం గడిగి కమ్మని కల్పలతాసుమాళితో
వలపులనింపు; మన్యగతిఁ బల్కకుము! నీవెటఁ? దన్ముఖంబెటన్?

చ. అలచెలిమేనిపైనిఁ గల యచ్చపుఁదామరతూండ్లు తేంట్లబా
రులవలెనయ్యె; నింద్రమణి రూపువహించెను నత్తుముత్తె మూ
ర్పులకుఁ, దటాన బుస్సుమనిపొంగెఁ జనుంగవ నిడ్డకప్ర; మ
క్కల! చెయిఁబడ్డనీర్మఱి గెఁగ్రాఁగినయిన్నుపయిన్ జలంబటుల్.

చ. మొగిళులు గ్రమ్మెమింట; వనభూములు చీకటిమ్రానిపిండుతో
నగపడెఁ గారువట్టె; నిసియయ్యె; భయస్థుఁడితండు రాధ! నీ
వాగినిలు నేర్పుశౌరి నన నూఁకొని వెంటనె నందు నానతిం
దగనటు చన్నవారియమునాతట కేళులు సాఁగె జైయనన్.

మ. పనిమీఁదంజనెనామగండు;సవతాల్ ప్రాంతానికిన్ రాదు;బై
ట నన్నున్ ముట్టుతయంచు పీడిగురులింటందూఱిరా బానిసల్
నను సేవింపక కూర్కుచుండిరి యలంతన్; రేయిశయ్యాసహా
యిని సన్నాగమలాలనీయ ! యిటురావే?కావ లక్ష్మీపతీ!

మ. తనివింబొందను నీదుదర్శనముచేతం జేతమం దచ్యుతా !
మనలం గాంచి రహఃస్థులం జను లెదం భావింతు రన్యంబుగా
ననియాపిల్పునఁదెల్పుచున్ నిజవృథాయాసంబుఁజింతిల్లు గో
పినిఁగాఁగింటికిఁదార్చి మోవిగొనుగోవిందుండుమిమ్మోముతన్.

---

# సాధుపత్రము

---

2వ పుటలో గ్రంధముల పట్టికలో 'ధ్వన్యాలోకము' ను జేర్పవలెను.

| | | |
|---|---|---|
| 10 | హొాయలర్ | హొాయలుర్ |
| 16 | మాఃండమ్మె | మాఃండమై |
| 18 | గారోత్తు | గోరోత్తు |
| 27 | మోకాలోమ్రడ్చి | మోకాళోమ్రడ్చి |
| ,, | శాండా | కాంతా |
| 28 | తోట్యాటమిం | తోల్యాటమిం |
| ,, | చెలియించున్ | చలియించున్ |

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రికృత

ముద్రితాముద్రిత గ్రంథములు

# ౧. జాతక కథాగుచ్ఛము

(ప్రథమభాగము)

ఇందు గౌతమబుద్ధుని పూర్వజన్మ కథ లయిదుగలవు. అజంతా, ఎల్లోరాలలోని చిత్తరువు లీ కథలలోనివే. జాతకకథలు ప్రపంచ ప్రఖ్యాతి గలవి. వీనిని గొందఱు గద్యరూపముగా విరచించిరి. పద్యరూపముగా నాంధ్ర భాషలో వెలువడిన గ్రంథ మిదియొక్కటియే. పెద్ద పెద్ద విద్వాంసులు మెచ్చుకొన్న గ్రంథము. దీనిని ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు బి. ఏ. కును మద్రాసు విశ్వవిద్యాలయమువారు విద్వాన్, యం. ఏ. పరీక్షలకును, మైసూరు విశ్వవిద్యాలయమువారు ఇంటరు పరీక్షకును పాఠ్యముగా నిర్ణయించిరి.

వెల రు. ౧—౦—౦.

# ౨. జాతక కథాగుచ్ఛము

(ద్వితీయభాగము)

ఇందు బుద్ధుని పూర్వజన్మ కథలు పదిగలవు. ఇదియును బండితులు పలువురు మెచ్చుకొన్నది.

వెల రు. ౧—౦—౦.

# ౩. కీరసందేశము - ద్వంద్వయుద్ధము

భాగవతమునందలి రుక్మిణీ పరిణయ కథయే కీరసందేశకథ. అం రుక్మిణి బ్రాహ్మణునిఁ బంపినది. ఇందుఁ గీరమును బంపినది. దానిఁబట్టి కథయును మాఱినది. ఇది మధురవాక్యమని పత్రికలు వ్రాసినవి.

ద్వంద్వయుద్ధమనఁగాఁ బితాపుత్రులయిన సోహాబు రుస్తుముల యు' కథ. ఆంగ్లమున మాత్యూ ఆర్నాల్డుకవి వ్రాసిన కావ్యమున కిది స్వేచ్ఛాను వాదము. ఈ కథను ఇంత రసవత్తరముగా నాంధ్రమున నెవ్వరును వ్రాయ లేదని హిందూ మొదలయిన పత్త్రికలు వ్రాసినవి. ఇది మిక్కిలి కరుణ రసప్రపూర్ణము. ఈ రెండు గ్రంథములును మద్రాసు విశ్వవిద్యాలయమువారు ఇంటరుపరీక్షకుఁ బాఠ్యముగా నిర్ణయించిరి.

వెల రు. ౧—౦—౦.

# ౪. గోవర్ధనాచార్య సప్తశతీసారము

## (శృంగారము)

సంస్కృతమున గోవర్ధనాచార్యుఁ డను పండితకవి వ్రాసిన ఆర్యా సప్తశతీగ్రంథమున కిది తెలుఁగుసేత. ఇందలి పద్యములు రసగుళికలు, హృద్యములైన భావములు.

౪౦౦ పద్యములు. వెల రు. ౧—౦—౦.

# ౫. అమృతకణములు

## ( శృంగారము )

సంస్కృతాలంకార గ్రంథములం దుదాహృతములైన యనాకరము లగు సంస్కృత శ్లోకముల కిది తెలుఁగుసేఁత. మనోహరమైన భావములు.

వెల రు. ౦—౮—౦.

# ౬. పుష్పలతోఁట

ఖండకావ్యముల సంపుటము. పెక్కు పత్రికలలోఁ బ్రకటించిన కావ్యము. స్వతంత్రములయిన భావములు. వెల రు. ౦—౩—౦.

# ౭. కావ్యమంజరి

ఇదియు ఖండకావ్యముల సంపుటమే. ఇందు "వరహాలు చేసే పద్యరత్నాలు గల" వని పత్రికలు వ్రాసినవి. వెల రు. ౦—౪—౦.

# ౮. నడుమంత్రపుసిరి

నడుమంత్రపుసిరి గలవాని స్థితి యిందు వర్ణితము. మన భాషలోఁ బద్యమున హాస్యము తక్కువ. ఆ కొఱంత నీ చిన్నపొత్తము దీర్పఁగలదు.
వెల రు. ౦—౪—౦.

# ౯. ఖడ్గతిక్కన

ఈతని చరిత్ర మెఱుఁగనివారు లేరు. కానీ దీని నెవరును ఇంతవఱకుఁ బద్యరూపముగా వ్రాసినవారును లేరు. వీరరస ప్రధానమైన గ్రంథము. మద్రాసు విశ్వవిద్యాలయమువారు ఇంటరునకుఁ బాఠ్యముగా నిర్ణయించిరి.
వెల రు. ౦—౩—౦.

# ౧౦. తత్సమచంద్రిక

ఆంధ్రభాషయందలి యొక భాగ మగు తత్సమమున కిది వ్యాకరణము. ఇది భట్టోజీ దీక్షిత విరచితమగు వైయాకరణ సిద్ధాంత కౌముదీ స్థితములగు సంధి, సమాస, సమాసాశ్రయవిధి, స్త్రీ ప్రత్యయ, కృత్తద్ధిత భాగముల నుండియు, కాశికా, మాధవీయ ధాతువృత్తి, గణరత్న మహోదధి, మహాభాష్యము మొదలయిన పెక్కు సంస్కృత గ్రంథములనుండియు కాశే